వ. అని యిట్లానతిచ్చి బ్రహ్మాది దేవతాసమూహంబుచేఁ బూజితుండై భగవంతుండైన శ్రీనృసింహ దేవుండు తిరోహితుం డయ్యెఁ బ్రహ్లాదుండును శూలికి బ్రణమిల్లి తమ్మిచూలికి వందనంబులు సేసి ప్రజాపతులకు మ్రొక్కి భగవత్కళలైన దేవతలకు నమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాది మునీంద్ర సహితుండై దైత్య దానవ రాజ్యంబునకుం బ్రహ్లాదుం బట్టంబుఁగట్టి యతని చేతఁబూజితుండై దీవించె నంత నీశానాది నిఖిల దేవతలు వివిధంబులగు నాశీర్వాదంబులచేత నా ప్రహ్లాదుని గృతార్థుంజేసి తమ్మిచూలినిముందట నిడికొని నిజస్థానంబులకుఁ జనిరి. ఇట్లు విష్ణుదేవుండు నిజపార్శ్వచరు లిరువురు బ్రాహ్మణ శాపంబునంజేసి ప్రథమజన్మంబున దితి పుత్రులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను వరాహ నారసింహరూపంబుల నవతరించి వధించె. ద్వితీయ భవంబు రాక్షసజన్మంబుఁ దాల్చిన రావణ కుంభకర్ణులను శ్రీరామ రూపంబున సంహరించెఁ; దృతీయ జన్మంబున శిశుపాల దంతవక్త్రులను పేరులం బ్రసిద్ధి నొందినవారలను శ్రీకృష్ణరూపంబున ఖండిచె నివ్విధంబున మూఁడు జన్మంబుల గాఢవైరానుబంధంబున నిరంతర సంభావితధ్యానులై వారలు హరినిందాది పాపవిముక్తులై హరిం గదిసిరని చెప్పి నారదుం డిట్లనియె.

ఉ. శ్రీరమణీయమైన నరసింహవిహారము; నింద్రశత్రుసం
హారము, బుణ్యభాగవతుఁడైన నిశాచరనాథ పుత్రసం
చారము, నెవ్వఁడైన సువిచారత విన్నఁ బఠించినన్
శుభా ! కారముతోడ నేభయముఁ గల్గనిలోకముఁ జెందు
భూవరా 385

మ. జలజాత ప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషా
వళిం । బలుకన్ లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు నీ
యింటిలో । జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్త
ప్రియుండై మహా । ఫలసంధాయకుఁడై చరించు టది
నీభాగ్యంబు రాజోత్తమా. 386

— త్రిపురాసుర సంహారము —

క. బహుమాయుఁడైన మయుచే
విహతంబగు హరునియసము విఖ్యాతజయా
వహముగ నీ భగవంతుఁడు
మహితాత్ముఁడు మున్నొనర్చె మనుజవరేణ్యా. 387

వ. అనిన ధర్మనందనుం డిట్లనియె.

క. ఏకర్మంబున విభుఁడగు
శ్రీకంఠునియశము మయునిచే సుడివడియెన్
వైకుంఠుఁ డెవ్విధంబునఁ
గైకొని తత్కీర్తి చక్కఁగా నొనరించెన్. 389

వ. అనిన నారదుండిట్లనియె.

క. చక్రాయుధ బలయుతులగు
శక్రాదుల కోహటించి శ్రమమున నసుహృల్
సాక్రోశంబుగ నరిగిరి
విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా. 391

వ. ఇట్లు రక్కసులు దన వెనుకఁజొచ్చిన మాయా నిలయుండును, దుర్ణయుండును నైన మయుండు దన విద్యాబలంబున నయో రజత సువర్ణమయంబులై యెవ్వరికిని లక్షింపరాని గమనాగమనంబులును వితర్కింప రాని కర్కశపరిచ్ఛదంబులును గలిగిన త్రిపురంబుల నిర్మించి యిచ్చిన నక్తంచరు లందఱు నందుం బ్రవేశించి కామసంచారులై పూర్వవైరంబుఁదలంచి సనాయకా నీకంబు లయిన లోకంబుల నస్తోకంబులయిన నిజబలాతి రేకంబుల శోకంబు నొందించిన. 392

క. లోకాధినాథు లెల్లను
శోకాతురులగుచు శరణఁజొచ్చిరి దుష్టా
నీకవిదళనాకుంఠుఁ
శ్రీకంఠున్ భువనభరణ చిత్తోత్కంఠున్. 393

వ. ఇట్లు సకలలోకేశ్వరుండగు మహేశ్వరుంజేరి లోక పాలకులు ప్రణతులై పూజించి కరకమలంబులు ముకుళించి, 394

క. త్రిపురాలయులగు దానవు
లపరాజితులగుచు మాకు నశ్రాంతంబున్

వపురాది పీడఁజేసెడ
రపరాధికులను వధింపు మగజాధీశా. 395

క. దీనులము గాక యుష్మద
ధీనులమై యుండుమేము దేవాహిత దో
ర్లీనుల మైనారము బల
హీనులమగు మమ్ముఁగావుమీశాన శివా. 396

వ. అనిన భక్తవత్సలుండగు పరమేశ్వరుండు శరణాగతు
లైన గీర్వాణుల వెఱవకుండని దుర్వారబలంబున
బాణాసనంబుఁ గేలనందికొని యొక్క దివ్యబాణంబు
సంధించి త్రిపురంబులపయి నేసిన మార్తాండమండ
లంబున వెలువడు మయూఖ జాలంబుల చందంబునఁ
దద్బాణంబువలన దేదీప్యమానంబులై యనేక బాణ
సహస్రంబులు సంభవించి భూనభోంతరాళంబులు నిండి
మండి తెప్పలుగాఁ గుప్పలుగొని త్రిపురంబులఁగప్పి
నప్పుడు తద్బాణపావక హేతి సందోహదందహ్యమానులై
గతాసులైన త్రిపుర పురనివాసులం దెచ్చి మహాయోగి
యైన మయుండు సిద్ధరస కూపంబున వైచిన. 397

క. సిద్ధామృత రసమహిమను
శుద్ధమహా వజ్రతుల్య శోభితతనులై
వృద్ధింబొందిరి దానవు
లుద్ధత నిర్ఘాతపావకోపము లగుచున్. 398

క. కూపామృత రససిద్ధిని
దీపితులై నిలిచియున్న దేవాహితులన్
రూపించి చింతనొందెడు
గోపధ్వజుఁజూచి చక్రి కృపానాన్వితుఁడై 399

శా. ఉత్సాహంబుననొక్కపాఁడి మొదవై యూధంబు ఘ్రాణించుచున్
వత్సంబై తనవెంట బ్రహ్మనడవన్ వైకుంఠుఁడేతెంచియు
ద్యత్సత్త్వంబునఁగూపమధ్యరసముంద్రావెన్విలోకించుచుం
దత్సౌభాగ్యనిమగ్నులై మఱచిరాదైత్యుల్ నివారింపఁగన్.

వ. ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేనువయి వచ్చి త్రిపురమధ్య కూపామృత రసంబు ద్రావిన నెఱింగి శోకాకుల చిత్తులయిన రసకూపపాలకులం జూచి మహాయోగియైన మయుండు వెఱఁగుపడి దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె— 401

ఆ. అమరులైన దనుజులైనను నరులైన
నెంత నిపుణులైన నెవ్వరైన
దైవికార్థచయముఁ దప్పింపఁగా లేరు
వలదు దనుజులార వగవమనకు. 402

వ. అనిపలికె నంత విష్ణుండు నైజంబులైన ధర్మ జ్ఞాన విద్యా తపోవిరక్తి సమృద్ధి క్రియాశక్తి విశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు సమర్పించి రథసూతకేతువర్మ బాణాసన ప్రముఖ సంగ్రామ సాధనంబులు సేసినం గైకొని— 403

మ. శరియై కార్ముకియై మహాకవచియై సన్నాహియై
వాహియై। సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేత
నచ్ఛత్రిఁడై । పరమేశుండొక బాణమున్ విడిచెఁ
దద్బాణానలజ్వాలలం। బురముల్గాలె ఘటచ్చట ధ్వని
నభోభూమధ్యముల్నిండఁగన్. 404

వ. ఇట్లు హరుండు దురవగాహంబులైన త్రిపురంబుల నభిజిన్ముహూర్తంబున భస్మంబుసేసి కూల్చిన నమర గరుడ గంధర్వ సిద్ధసాధ్య యక్షవల్లభులు వీక్షించి జయజయ శబ్దంబులు సేయుచుఁ గుసుమవర్షంబులు వర్షించిరి; ప్రజలు హర్షించిరి. బ్రహ్మాదులు గీర్తించి రప్సరసలు నర్తించిరి. దివ్యకాహళ దుందుభీరవంబులును మునిజనోత్సవంబులును బ్రచురంబులయ్యె నిట్లు విశ్వజనీనంబగు త్రిపురాసురసంహారంబున నఖిలలోకులును సంతసిల్లియుండ నయ్యవసరంబున. 405

ఆ. తృణకణములభంగిఁ ద్రిపురంబుల దహించి
పరముఁ డవ్యయుండు భద్రయశుఁడు
శివుఁడు పద్మజాది జేగీయమానుఁడై
నిజనివాసమునకు నెమ్మిఁ జనియె. 406

వ. ఇట్లు నిజమాయావిశేషంబున మర్త్యలోకంబున విడంబించుచున్న విష్ణుని పరాక్రమ విధానంబులు మునిజన వంద్యమానంబులై సకలలోక కల్యాణప్రదానంబులై యుండుననిన విని నారదునకు ధర్మనందనుం డిట్లనియె.

—* నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమధర్మంబులుఁ జెల్పుట *—

సీ. అనఘాత్మ సకలవర్ణాశ్రమాచార స
మ్మతధర్మ మెయ్యది మానవులకు
నేధర్మమున నరుండిద్ధవిజ్ఞానము
భక్తియుఁ బ్రాపించుఁ బద్మజునకు
సాక్షాత్సుతుండవు సర్వజ్ఞుఁడవునీకు
నెఱుఁగరానిది ధర్మమింత లేదు
నారాయణపరాయణ స్వాంతులనఘులు
శాంతులు సదయులు సాధువృత్తి

ఆ. మెఱయుచున్న ఘనులు మీవంటివారెద్ది
పరమధర్మమనుచు భక్తిఁదలఁతు
రట్టి ధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు
వినఁగ నిచ్చగలదు విమలచరిత. 408

వ. అనిన నారదుండు ధర్మరాజుంజూచి దాక్షాయణియందు నిజాంశంబున నవతరించి భువనశోభనంబు కొఱకు బదరికాశ్రమంబునఁ దపోనిరతుండయి యున్న నారాయణుని వలన సనాతన ధర్మంబు వింటి నది సెప్పెద సకల వర్ణంబుల జనులకు సత్యంబును దయయును నుపవాసాది తపంబును శౌచంబును సైరణయు సదసద్వివేకంబును మనో నియమంబును బహిరింద్రియ జయంబును హింస లేమియు బ్రహ్మచర్యంబును దానంబును యథోచిత జపంబును సంతోషంబును మార్దవంబును సమదర్శ

నంబును మహాజనసేవయు గ్రామ్యంబులయిన కోరికలు మానుటయు నిష్ఫలక్రియలు విడుచుటయు మితభాషిత్వంబును దేహంబుగాని తన్ను వెదకికొనుటయు, నన్నోదకంబులు ప్రాణులకుం బంచియిచ్చుటయుం బ్రాణులందు దేవతాబుద్ధియు నాత్మబుద్ధిం జేయుటయుం శ్రీనారాయణ చరణ స్మరణ కీర్తన శ్రవణ సేవార్చన నమస్కార దాస్యాత్మసమర్పణసఖ్యంబులనియెడి త్రింశల్లక్షణంబులును గలుగవలయు నందు సత్కులాచారుండయి మంత్రనంతంబులైన గర్భాధానాది సంస్కారంబులవిచ్ఛిన్నంబులుగాం గలవాఁడు ద్విజుండు ద్విజునకు యజన యాజనాధ్యయనాధ్యాపనదాన ప్రతిగ్రహంబులను షట్కర్మంబులు విహితంబులు రాజునకుఁ బ్రతిగ్రహ వ్యతిరిక్తంబులయిన యజనాది కర్మంబులయిదును ప్రజాపాలనంబును బ్రాహ్మణులుగాని వారి వలన దండశుల్కాదులు గొనుటయు విహిత కర్మంబు వైశ్యునికిఁ గృషివాణిజ్య గోరక్షణాది కర్మంబులును బ్రాహ్మణకులానుసరణంబును విహితంబులు శూద్రునకు ద్విజశుశ్రూష సేయవలయు.

సీ. విను కర్షణాదిక వృత్తికంటెను మేలు
యాచింపనొల్లనియట్టి వృత్తి
ప్రాప్తంబుగైకొని బ్రతుకుకంటెను లెస్స
యనుదినంబును ధాన్యమడిగికొనుట
యాయవారముకంటె నధిక కల్యాణంబు
పఱిగ యెన్నులధాన్య భక్షణంబు

శిలవృత్తికంటెను శ్రేయమాపణములఁ
బడ్డగింజలుఁ దిని బ్రదుకుఁగనుట

ఆ. యెడరుచోట నృపతికి నాల్గువృత్తులుఁ
దగుఁబ్రతిగ్రహంబు దగదు తలఁప
నాపదవసరముల నధముఁ డెక్కువజాతి
వృత్తి నున్న దోషవిధముగాదు. 410

వ. వినుము శిలవృత్తియు నుంఛవృత్తియు ఋతమనియు
నయాచితవృత్తి యమృతమనియు యాయావరవృత్తి
మృతమనియుఁ గర్షకవృత్తి ప్రమృతమనియు నెన్నుదు
రట్టి వృత్తు లెఱింగి జీవించుటమేలు వాణిజ్యంబు
సత్యానృతమనియు శ్వవృత్తి నీచసేవయనియుఁ
బలుకుదురు సర్వవేదమయుండు బ్రాహ్మణుండు
సర్వదేవమయుండు క్షత్రియుండు బ్రాహ్మణ క్షత్రియు
లకు నీచసేవనంబు కర్తవ్యంబుగాదు. 411

క. దమమును శౌచముఁ దపమును
శమమును మార్దవముఁ గృపయు సత్యజ్ఞాన
క్షమలును హరిభక్తియు హ
ర్షము నిజ లక్షణము లగ్రజాతికి సధిపా. 412

ఉ. శౌర్యము దానశీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ
దేజముఁ । ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థ
ముఁ గామముఁ బుధా । చార్య ముకుందసేవలును
సత్కృతియుం బరితోషణంబు స। ద్వీర్యము రక్షణంబుఁ
బృథివీవరశేఖర రాజచిహ్నముల్. 413

క. ధర్మార్థకామవాంఛయు
నిర్మలగురు దేవవిప్రనివహార్చనముల్
నిర్మదభావముఁ బ్రముదము
శర్మకరత్వమును వైద్యజనలక్షణముల్. 414

ఉ. స్తేయములేనివృత్తియు శుచిత్వము సన్నుతియుం నిజేశు
లం। మాయలు లేకడాయుటయు మంత్రము సెప్పక
పంచయజ్ఞముల్। సేయుటయుం ధరామరుల సేవయు
గోవులరక్షణంబు న। న్యాయము లేమియుం మనుజనాథ
యెఱుంగుము శూద్రధర్మముల్. 415

సీ. నిలయమ్ము వాటించి నిర్మలదేహియై
శృంగారమేప్రొద్దుఁ జేయవలయు
సత్యప్రియాలాప చతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రంజింపవలయు
దాక్షిణ్యసంతోష ధర్మమేధాదుల
దైవతమని ప్రియుఁ దలపవలయు
నాథుఁడేపద్ధతి నడచు నాపద్ధతి
నడచి తద్బంధుల నడపవలయు

ఆ. మార్దవమునఁ బతికి మజ్జనభోజన
శయనపానరతులు జరుపవలయు
విభుఁడు పతితుఁడైన వెలదిపాతివ్రత్య
మహిమఁబున్యుజేసి మనుపవలయు. 416

క. తరుణి తన ప్రాణవల్లభు
హరిభావముగా భజించి యతఁడుఁ దానుఁ
సిరికై వడి వర్తించును
హరిలోకమునందు సంతతానందమునన్. 417

క. ఉపవాసంబులు వ్రతములుఁ
దపములు వేయేల భర్తదైవత యని ని
ష్కపటతఁ గొలిచిన సాధ్వికి
నృపవర! దుర్లభము లేదు నిఖిలజగములన్. 418

వ. మఱియు సంకరజాతులయిన రజకచర్మకారక నట బురుడ కైవర్తక మ్లేచ్ఛభిల్లు రగు నంత్యజాతు లేడ్వురకును జండాలపుల్కస మాతంగ జాతులకును నాయా కులాగతంబులయిన వృత్తుల జౌర్యహింసాదులు వర్జించి సంచరింపవలయు. మానవులకుఁ బ్రతియుగంబున నైసర్గికంబులైన ధర్మంబులు రెండు లోకంబులందును సుఖకరంబులని వేదవిదులైన పెద్దలు సెప్పుదురు. కాలుకాలున దున్నెడు క్షేత్రంబులాపు సెడు నందుఁజల్లినబీజంబులుని స్తేజంబులై యుండి లెస్సగ నంకురింపవు నిరంతరఘృత ధారావర్షంబున దహనునకు దాహకత్వంబు లేక శాంతిం జెందు నందు వేల్చిన హవ్యంబులును ఫలింపవు. తద్విధంబున ననవరత కామానుసంధానంబునఁ గామోన్ముఖంబైన చిత్తంబు కామంబులం దనిసి నిష్కామంబై విరక్తి నొందుం గావున సత్త్వస్వభావంబుతోడ నెప్పుడుఁ

దప్పక నిజవంశాచార విహితధర్మంబున వర్తించు నరుండు మెల్లన స్వాభావిక కర్మపరత్వంబు విడిచి ముక్తినొందు జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపం బనిలేదు. శమదమాది వర్ణలక్షణ వ్యవహారంబులఁ గన వలయునని మఱియు నారదుం డిట్లనియె. 419

క. క్రమమున వర్ణంబుల చి
హ్నము లెల్లను జెప్పఁబడియె నాశ్రమముల ధ
ర్మము లెఱిఁగించెద నన్నియు
సమదాహిత హృదయశూల సదమలశీలా. 420

వ. వినుము బ్రహ్మచారి మౌంజీకౌపీన యజ్ఞోపవీత కృష్ణాజిన పలాశదండ కమండలు ధరుండును సంస్కారహీన శిరోరుహుండును దర్భహస్తుండును శీలప్రశస్తుండును మౌనియునై త్రిసంధ్యంబును బ్రహ్మ గాయత్రి జపియించుచు సాయంప్రాంతరవసరంబుల నర్కపావక గురుదేవతోపాసనంబులు సేయుచు గురుమందిరంబునకుం జని దాసునిచందంబున భక్తివినయ సౌమనస్యంబులు గలిగి వేదంబులు సదువుచు నధ్యయనోపక్రమావసానంబుల గురుచరణంబులకు నమస్కరించుచు రేపు మాపును విహితగృహంబుల భిక్షించి భైక్షంబు గురువులకు నివేదించి యనుజ్ఞఁగొని మితభోజనంబు గావించుచు నర్హకాలంబుల నుపవసించుచు నంగనలందు నంగనాసక్తులం బ్రయోజనమాత్రభాషణంబు లోన

ర్చుచు గురుపరాంగనల వలన నభ్యంగన కేశప్రసాధన శరీరమర్దన మజ్జన రహస్యయోగంబులు వర్జించుచు గృహంబున నుండక జితేంద్రియత్వంబున సత్యభాష ణుండయి సంచరింపవలయు 421

ఆ. పొలఁతి దావవహ్ని పురుషుఁడాజ్యఘటంబు
కరఁగకుండరాదు కదిసెనేని
బ్రహ్మయైనఁ గూఁతుఁ బట్టకమానఁడు
వడుగు కింకఁబొత్తు వలదు వలదు. 422

వ. వినుము స్వరూప సాక్షాత్కారంబున దేహబహిరింద్రియాదికంబయిన యింతయు నాభాసమాత్రంబుగా నిశ్చయించి యెందాఁక జీవుండు స్వతంత్రుండయిన యీశ్వరుఁడు గాకుండు నంత దడవు నంగన యిది పురుషుండ నే నని యెడి భేదబుద్ధి మానుట కర్తవ్యంబు గాదు. బ్రహ్మచారి యతి గృహస్థులం దెవ్వఁడైన జిత్తంబు పరిపక్వంబు గాక యద్వైతానుసంధానంబుసేసిన మూఢుండగుం గావున రహస్యంబునఁ బుత్రికనైనం డాయకుండవలయు.

చ. శిరమున మేనసంస్కృతులు సేయక చందనభూషణాద్యలం
కరణములెల్ల మాసి ఋతుకాలమునన్ నిజభార్యఁబొందుచుం। దరుణులఁజూడక బాలక ధృతవ్రతుఁడై మధుమాంస వర్జియై। గురుతరవృత్తితో మెలఁగు గోవిదుఁ డొక్క గృహస్థుభూవరా. 424

వ. మఱియు ద్విజుండు గృహస్థుండై గురువుల వలనను నుపనిషదంగ సహితంబైన వేదత్రయంబును బఠియించి నిజాధికారానుసారంబుగ నర్థవిచారంబు సేసి తనబలంబు కొలంది గురువులకు నభీష్టంబు లొసంగి గృహంబున నొండె వనంబున నొండె నైష్ఠికత్వంబు నాశ్రయించి యొండెఁ బ్రాణులతోడ జీవించుచు గురువునందు నగ్ని యందు నాత్మయందు సర్వభూతములందు నచ్యుత దర్శనంబు సేయుచు నింద్రియ వ్యసనాది మగ్నుఁడు గాక యెఱుక గలిగి వర్తించుచు బ్రహ్మంబునొందు.

క. వినుము వన ప్రస్థునకును
మునికథితములైన నియమములగల వాచో
ష్పనవనగతుఁడై మెలఁగెడి
ఘనుఁడు మహర్లోకమునకు గమనించునృపా. 426

వ. అటమీఁద గృహాస్థాశ్రమంబు విడిచి వనంబునకుం జని దున్నక పండెడి నీవారాదికంబు లగ్నిపక్వంబు సేసి యొండె నామనంబులసేసి యొండె నర్కపక్వంబులైన ఫలాదు లొండె భక్షించుచు వన్యాహారంబుల నిత్య కృత్యంబులయిన చరుపురోడాశంబు లొనర్చుచుఁ బ్రతి దినంబును బూర్వసంచితంబులు పరిత్యజించి నూతన ద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్నికొఱకుఁ బర్ణశాల యైనఁ బర్వతకందరం బయిన నాశ్రయించుచు హిమ వాయు వహ్ని వర్షాతపంబులకు సహించుచు

నఖ శ్మశ్రు కేశ తనూరుహంబులు ప్రసాధితంబులు సేయక జటిలుండై వసించుచు దండాజనకమండలు వల్కల పరిచ్ఛదంబులు ధరియించి పండ్రెండైన నెనిమిదైన నాలుగైన రెండైన నొక వత్సరం బయినఁ దపఃప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ మునియై చరించుచు దైవవశంబున జరారోగంబులచేతఁ జిక్కి నిజధర్మానుష్ఠాన సమర్థుండు గాని సమయంబున నిరశన వ్రతుండయి యగ్నుల నాత్మారోపణంబు సేసి సన్న్యసించి యాకాశంబునందు శరీర రంధ్రంబులును గాలియందు నిశ్వాసంబును దేజంబులోపల నూష్మం బును జలంబుల రసంబును ధరణియందు శల్యమాంస ప్రముఖంబులును వహ్నియందు వక్తవ్యంబుతోడ వాక్కుని నింద్రునియందు శిల్పంబుతోడఁ గరంబులును విష్ణునియందు గతితోడఁ బదంబులును ప్రజాపతియందు రతితోడ నుపస్థంబును మృత్యువందు విసర్గంబుతోడఁ బాయువును దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును వాయువందు స్పర్శంబుతోడఁ ద్వక్కును సూర్యుని యందు రూపంబుతోడఁ జక్షువులును సలిలంబులందుఁ బ్రచేతస్సహిత మయిన జిహ్వయు క్షితియందు గంధసహితం బయిన ఘ్రాణంబును జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును గవియైన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు రుద్రునియం దహంకారం

బుత్తోడ మమత్వంబును క్షేత్రజ్ఞునియందు సత్త్వంబు తోడఁ జిత్తంబును బరంబునందు గుణంబులతోడఁ వైకారికంబును డిందించి యటమీఁద పృథివియందుఁ బృథివిని జలంబునందు జలంబును దేజంబునందు దేజంబును వాయువునందు వాయువును గగనంబునందు గగనంబును నహంకారతత్త్వంబునందు నహంకారంబును మహత్తత్త్వంబునందు మహత్తత్త్వంబును బ్రకృతియందుఁ బ్రకృతిని నక్షరుండైన పరమాత్మ యందులయంబు నొందించి చిన్మాత్రావశేషితుండయిన క్షేత్రజ్ఞుని నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుండయి దగ్ధకాష్ఠుఁడయిన వహ్నిచందంబునఁ బరమాత్మయైన నిర్వికార బ్రహ్మంబునందు లీనుండు గావలయును. 427

క. అనఘు వనప్రస్థుండై
చని తద్ధర్మంబు లిట్లు సలుపుచు మఱియుఁ
మనె నేని సన్న్యసింపం
జను నటమీఁదటను ముక్తసంగత్వమునన్. 428

వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబుజరిపిసన్న్యసించి దేహమాత్రావశిష్టుండును నిరపేక్షుండును భిక్షుండును నిరాశ్రయుండును నాత్మారాముండును, సర్వభూతసముండును, శాంతుండును, సమచిత్తుండును నారాయణ పరాయణుండును నైకౌపీనంబునకు నాచ్ఛాదన మాత్రంబైన వస్త్రంబు ధరియించి దండాది వ్యతిరిక్తంబులు విసర్జించి

యాత్మపరంబులుగాని శాస్త్రంబులు వర్జించి గ్రహనక్ష
త్రాది విద్యలనభ్యసింపక భేదవాదంబులైన తర్కంబులు
దర్శింపక యెందును బక్షీకరింపక శిష్యులకు గ్రంథం
బులు వచించి యుపన్యసింపక బహువిద్యల జీవింపక
మత్తాదివ్యాపారంబుల నుల్లసిల్లక, పెక్కుదినంబు
లొక్కయెడ వసింపక యూరూర నొక్కొక్క రాత్రి
నిలుచుచుం గార్యకారణ వ్యతిరిక్తంబైన పరమాత్మ
యందుం విశ్వంబుదర్శించుచు సదసన్మయంబైన విశ్వంబు
నందుం బరబ్రహ్మంబయిన యాత్మ నవలోకించుచు
జాగరణస్వప్నసంధి సమయంబుల నాత్మనిరీక్షణంబు
సేయుచు నాత్మకు బంధమోక్షణంబులు మాయా
సూత్రంబులుగాని వస్తుప్రకారంబున లేవనియును
దేహంబునకు జీవితంబు ధ్రువంబుగాదనియు మృత్యువు
ధ్రువంబనియు నెఱుంగుచు భూతదేహంబుల సంభవ
నాశంబులకు మూలంబయిన కాలంబుం బ్రతీక్షించుచు
నివ్విధంబున జ్ఞానోత్పత్తిపర్యంతంబు జరియించి యట
మీఁద విజ్ఞానవిశేషంబు సంభవించినం బరమహంసుండై
దండాదిచిహ్నంబులు ధరియించియుండె ధరింపక యుండె
బహిరంగవ్యక్త చిహ్నుండుగాక యంతరంగవ్యక్తం
బైన యాత్మానుసంధానంబుగలిగి మనీషియైబాహ్యాను
సంధానాభావంబున మనుష్యులకుం దనవలన నున్మత్త
బాలమూకుల తెఱంగుం జూపుచుండవలయును. 429

*— ప్రహ్లాదాజగరసంవాదము *—

క. మునివల్లభుఁడజగరుఁడను
సునయుండు హిరణ్యకశిపుసూనుండును ము
న్నొనరించిన సంవాదము
వినుమీ యర్థంబునందు వెలయు నరేంద్రా. 430

వ. తొల్లి భగవత్ప్రియుండయిన ప్రహ్లాదుండు గతిపయామాత్య సమేతుండయి లౌకికతత్త్వంబు నెఱింగెడి కొఱకు లోకంబుల సంచరించుచు నొక్కనాడు కావేరీతీరంబున సహ్యపర్వత తటంబున ధూళిధూసరితంబు లయిన కరచరణాద్యవయవంబులతోడ గూఢంబైన నిర్మల తేజంబుతోఁ గర్మాకార వచోలింగవర్ణాశ్రమాదుల నెవ్వరికి నెఱుంగఁ బడక నేల నిద్రించుచు నజగరవ్రతధరుండైన మునింగని డాయం జని విధివత్ప్రకారంబున నర్చించి మునిచరణములకు శిరంబు మోపి మ్రొక్కి యతని చరిత్రంబుఁ దెలియ నిశ్చయించి యిట్లనియె. 431

సీ. భూమి నుద్యోగియై భోగియై యుండెడి
నరుని కైవడి మునినాథ నీవు
ఘనశరీరముఁ దాల్చి కదలవు చిత్రము
ద్యమయుక్తునకుఁ గాని ధనములేదు
ధనవంతునకు గాని తగుభోగములు లేవు
భోగికిఁగాని సంపూర్ణమైన

తనువు లేదుద్యోగ ధనభోగములు లేక
నేలనూరక పడినిద్రవోవు

ఆ. నీకు నెట్లుగలిగె నిరుపమదేహంబు
సముఁడవార్యుఁడవు విశారదుఁడవు
బుద్ధినిధివి జనులఁబొగడవుఁ దెగడవు
నిద్ర ప్రతిదింబు నిలుపనేల. 432

వ. అని యిట్లు ప్రహ్లాదుండడిగిన వికసితముఖుం డయి
మునీంద్రుండుఁ దదీయమధురాలాప సుధారస ప్రవాహం
బులు కర్ణంబులఁ బరిపూర్ణంబులైన నతని నవలోకించి
యిట్లనియె. 433

సీ. అంతరంగికదృష్టి నంతయు నెఱుఁగుదు
వార్యసమ్మతుఁడ వీ వసుర వర్య
విశ్వజంతువుల ప్రవృత్తి నివృత్తుల
క్షణములు నీ యెఱుంగనివి లేవు
భగవంతుఁ డగుహరి పాయక నీమనో
వీధి రాజిల్లుచు వెలుఁగుచేని
క్రమమున బహుళాంధకారంబు బరిమార్చుఁ
బరమసాత్త్వికుఁడవు భద్రబుద్ధి

ఆ. వైననీవు నన్ను నడిగెదు గావున
విన్న ధర్మ మెల్ల విస్తరింతు
నిన్నుఁజూడఁ గలిగె నీతోడిమాటల
నాత్మశుద్ధి గలిగె ననఘచరిత. 434

వ. వినుము ప్రవాహకారిణియై విషయంబులచేతం బూరింప రాని తృష్ణచేతంబడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండ నైన నేను నానావిధ యోనులందుఁ బ్రవేశించుచు వెడలుచు నెట్టకేలకు మనుష్య దేహంబు ధరియించి యందు ధర్మంబున స్వర్గద్వారంబును నధర్మంబున శునక సూకరాది తిర్యగ్జంతుయోనిద్వారంబుల నొంది క్రమ్మఱ మనుష్యుండై పుట్టవలయునని వివేకించి సుఖ రక్షణ దుఃఖ మోక్షంబులకొఱకు ధర్మంబుసేయు దంపతుల వ్యవహారంబుఁగని సర్వక్రియానివృత్తి గలిగిన జీవుండు స్వతంత్రుండై ప్రకాశించునని నిర్ణయించి భోగంబులు మనోరథ జాతమాత్రంబులుగాని శాశ్వ తంబులుగావని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు లేక నిద్రించుచు బ్రారబ్ధభోగంబుల ననుభవించుచు నుండుదు. నివ్విధంబునఁ దనకు సుఖరూపంబైన పురుషా ర్థంబు దనయందుఁగలుగుట యెఱుంగక పురుషుండు శైవాలజాల నిరుద్ధంబులైన శుద్ధజలంబుల విడిచి యెండ మావులు జలంబులని పాఱెడు మూఢుని వడువునసత్యంబు గాని ద్వైతంబుఁ జొచ్చి ఘోరసంసార చక్రపరిభ్రాం తుండై యుండు దైవతంత్రంబులైన దేహాదులచేత నాత్మకు సుఖంబును దుఃఖనాశంబునుం గోరుచు నిరీశుం డైనవాని ప్రారంభంబులు నిష్ఫలంబులగు నదియునుం గాక మర్త్యునకు ధనంబు ప్రాప్తంబయిన నది దుఃఖ కరంబుగాని సుఖకరంబుగాదు లోభవంతులయిన ధన

వంతులు నిద్రాహారంబులు లేక రాజ చోర యాచక శత్రుమిత్రాది సర్వస్థలంబులందును శంకించుచు దాన భోగంబులు మఱచి యుండుదురు, ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు శోక మోహ భయ క్రోధ రాగ శ్రమాదులు వాంఛా మూలంబులు వాంఛ లేకుండ వలయును. 435

మ. సరఘల్ గూర్చిన తేనె మానవులకుఁ సంప్రాప్తమై
నట్లు లో | భరతుల్ గూర్చిన విత్తముల్ పరులకుం
బ్రాపించుఁ బ్రాప్తాశినై | తిరుగంబోని మహోరగంబు
బ్రతుకుఁ దీర్ఘాంగమై యుండియుం | జిరకాలంబుగా
వానివర్తనము నేఱింతించి యేకాంతినై. 436

క. అజగరమును జుంటీగయు
నిజగురువులుగాఁ దలంచి నిశ్చింతుఁడనై
విజనస్థలిఁ గర్మంబుల
గజిబిజి లేకున్న వాఁడ గౌరవవృత్తిఁ. 437

సీ. అజినవల్కలదుకూలాంబరంబులు గట్టి
నైన గట్టక యైన నలరుచుండు
నాందోళికా రథ హయనాగముల నెక్కి
యైన నెక్కక యైన నరుగుచుండు
గర్పూరచందన కస్తూరికా లేప
మైన భూరజమైన నలఁదికొందు
భర్మశయ్యల నైనఁ బర్ణశిలాతృణ
భస్మంబులందైనఁ బండుచుండు

క. మానయుక్తమైన మానహీనంబైన
దీయనైన మిగులఁ దిక్తమైన
గుడుతు సగుణమైన గుణవర్జితంబైన
నల్పమైనఁ జాల నధికమైన. 438

క. లేదని యెవ్వరినడుగను
రాదని చింతింపఁబరులు రప్పించినచో
గాదని యొద్దియు మానను
ఖేదము మోదమునులేక క్రీడింతుమదిన్. 439

క. నిందింపఁ బరులనెన్నఁడు
వందింప ననేకపీడ వచ్చినామదినా
క్రందింప విభవముల కా
నందింపఁ బ్రకామవర్తనంబున నధిపా. 440

వ. ఇట్లు గోరికలు లేక యొక్కసమయంబున దిగంబరుఁ డనై పిశాచంబు చందంబున నుండుచుఁ బెక్కుదినంబులంగోలెఁ బెనుఁబాఁపవర్తనంబుఁ గైకొని నిమీలితలోచనత్వంబున నేకాంతభావంబు విష్ణునియందుఁజేర్చి వికల్పంబు భేదగ్రాహకచిత్తవృత్తులఁజిత్తంబు నర్థరూపవిభ్రమంబుగలమనంబు నందు మనంబును నహంకారంబునందు నహంకారంబును మాయయందు మాయనునాత్మానుభూతియందు లయంబు నొందించి సత్యంబు దర్శించుచు విరక్తినొంది స్వానుభవంబున నాత్మస్థితుండనై యుండుదు. నీవు భగవత్పరుండవు

గావున రహస్యంబైన పరమహంసధర్మంబు స్వానుభవ గోచరంబైన తెఱంగున నీకు హృద్గోచరంబగునట్లు సెప్పితి ననిన విని. 441

క. ఘను నజగరమునివల్లభు
దనుజేంద్రుఁడు పూజసేసి తగఁ బీడ్కొని నె
మ్మనమున సంతోషించుచుఁ
జనియెఁ నిజగేహమునకు శశికులతిలకా. 442

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె.

క. నను బోఁటి జడగృహస్థుఁడు
మునివల్లభ యిట్టిపదవి మోదంబున నే
యనువునఁ జెందును వేగమ
వినిపింపుము నేఁడు నాకు విజ్ఞాననిధీ. 444

వ. అనిన నారదుం డిట్లనియె గృహస్థుండయినవాఁడు వాసుదేవార్పణముగా గృహోచితక్రియ లనుసంధించుచు మహామునుల సేవించి వారలవలన నారాయణదివ్యావతారకథాకర్ణనంబుసేయుచు నవ్యోవిహిత కాలంబుల శాంతజనులం గూడి మెలంగుచుఁ బుత్రమిత్రకళత్రాది సంగంబులు గలలవంటివని యెఱుంగుచు లోపలనాసక్తి లేక సక్తునికైవడి వెలుపలఁబురుషకారంబులొనర్చుచుఁ దగులంబు లేక విత్తంబులిచ్చి జనకసుతసోదరసఖిజ్ఞాతి జనుల చిత్తంబులు సమ్మదాయత్తంబులు గావించుచు ధనధాన్యనిధానదైవ లబ్ధంబుల వలన నభిమానంబు

మాని యనుభవించుచు గృహక్షేత్రంబులఁజొచ్చి యుదరపూరణం మాత్రంబు దొంగిలిన వాని దండింపక భుజగమృగమూషిక మర్కట మక్షికా ఖరోష్ట్రంబుల హింసింపక పుత్రులభంగి నీక్షించుచు దేశకాలదైవంబుల కొలందిని ధర్మార్థకామంబులఁ బ్రవర్తించుచు శునక పతిత చండాలాదులకైన భోజనపదార్థంబులు దగినభంగి నిచ్చుచు నిజవృత్తి లబ్ధంబులగు నశనాదులచేత దేవఋషి పితృభూతమానవులసంతర్పించుచుఁబంచమహాయజ్ఞావశేషంబుల నంతర్యామి పురుష యజనంబును నాత్మజీవనోపాయంబును సమర్థించుచు నుండవలయు. 445

ఆ. జనకగురులనైనఁ జంపు నర్థమునకై
ప్రాణమైనవిడుచు భార్యకొఱకు,
నట్టిభార్యఁ బురుషుఁ డతిథి శుశ్రూష సే
యించి గెలుచు నజితు నీశునైన. 446

ఆ. పరముఁడీశ్వరుండు బ్రాహ్మణముఖమున
నాహరించి తుష్టుఁడయినభంగి
నగ్నిముఖమునందు హవ్యరాసులుగొని
యైనఁ దుష్టినొందఁ డనఘచరిత. 447

వ. కావున గృహస్థుండు బ్రాహ్మణులందును దేవతలందును మర్త్యపశుప్రముఖజాతులందును నంతర్యామియుబ్రాహ్మణానుండునునైన క్షేత్రజ్ఞునందు నయ్యైకోర్కెలు సమ

ర్పించి సంతర్పణంబు సేయవలయు భాద్రపదంబునం గృష్ణపక్షంబునందును దక్షిణోత్తరాయణంబు లందును రేయుంబగలు సమమైన కాలంబులందును వ్యతీపాతంబు లందును దినక్షయంబులందును సూర్యచంద్రగ్రహణంబు లందును శ్రవణ ద్వాదశియందును వైశాఖశుక్లతృతీయ యందును గార్తిక శుక్లసప్తమి యందును హేమంత శిశిరంబులలోన నాలుగష్టకలందును మాఘ శుక్ల నవమియందును మాస నక్షత్రంబులతోడం గూడిన పున్నమలందును ద్వాదశితోడంగూడిన యుత్తరాత్రయ శ్రవణానూరాధలందును నుత్తరాత్రయ సహితంబులైన యేకాదశుల యందును జన్మనక్షత్ర యుక్తదివసంబు లందును మఱియుం బ్రశస్తకాలంబులందును జననీజనక బంధుజనులకు శ్రాద్ధంబులును జపహోమస్నానవ్రతంబు లును దేవబ్రాహ్మణ సమారాధనంబులును నాచరింప వలయు, భార్యకు బుంసవనాదికంబును నపత్యంబునకు జాతకర్మాదికంబును దనకు యజ్ఞదీక్షాదికంబును బ్రేత జనులకు దహనాదికంబును మృతదివసంబున సాంవత్స రికంబును జరుపవలయు. 448

మ. విను మేదేశములం దయాగుణ తపోవిద్యాన్వితంబైన
విప్ర। నికాయంబు వసించు నేస్థలములం భాగీరథీ
ముఖ్యావా। హినులుండుఁ హరిపూజ లెయ్యెడల
భూయిష్ఠప్రకారంబులం। దనరుం భూవరయిట్టిచోటుల
దగుం ధర్మంబులం జేయఁగం. 449

క. హరియందు జగము లుండును
హరిరూపము సాధుపాత్రమందుండు శివం
కరమగు పాత్రము గలిగిన
నరయఁగ నది పుణ్యదేశ మనఘచరిత్రా. 450

వ. మఱియుఁ గురుక్షేత్రంబును గయాశీర్షంబును బ్రయాగం
బును బులహాశ్రమంబును నైమిశంబును ఫాల్గునంబును
సేతువును బ్రభాసంబును గుశస్థలియును వారణాశియు
మధురాపురియును బంపాబిందు సరోవరంబులును నారా
యణాశ్రమంబును సీతారామాశ్రమంబును మహేంద్ర
మలయాదులైన కులాచలంబులును హరిప్రతిమార్చన
ప్రదేశంబులును (హరిసేవాపరులైన పరమభాగవతులు
వసించెడు పుణ్యక్షేత్రంబులును) శుభకాముండైన
వాఁడు సేవింపవలయు. 451

ఆ. భూనరేంద్ర యిట్టి పుణ్యప్రదేశంబు
లందు నరుఁడు సేయునట్టి ధర్మ
మల్పమైన నది సహస్రగుణాధిక
ఫలము నిచ్చు హరికృపావశమున. 452

వ. వినుము చరాచరంబయిన విశ్వమంతయు విష్ణుమయం
బగుటం జేసి పాత్రనిర్ణయ నిపుణులైన విద్వాంసులు
నారాయణుండు ముఖ్యపాత్రంబని పలుకుదురు
దేవఋషులును బ్రహ్మపుత్రులైన సనకాదులును
నుండ భవదీయ రాజసూయంబున నగ్రపూజకు

హరిసమ్మతుండయ్యె ననేకజంతుసంఘాతసంకీర్ణంబైన బ్రహ్మాండపాదపంబునకు నారాయణుండు మూలంబు దన్నిమిత్తంబున నారాయణసంతర్పణంబు సకలజంతుసంతర్పణంబని యెఱుంగుము ఋషి నర తిర్యగమర శరీరంబులు పురంబులు వానియందుఁ దారతమ్యంబులతోడ జీవరూపంబున భగవంతుండయిన హరి వర్తించుటం జేసి పురుషుండనఁ బ్రసిద్ధుండయ్యె నందుఁ దిర్యగ్జాతులకంటె నధికత్వంబు పురుషునియందు విలసిల్లుటం జేసి పురుషుండు పాత్రంబు పురుషులలోన హరి తనువైన వేదంబును ధరించుచు సంతోషి విద్యాతపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు బ్రాహ్మణులలోన నాత్మజ్ఞానపరిపూర్ణుండైన యోగి ముఖ్యపాత్రంబని పలుకుదురు పరస్పర పాత్రంబులకు సహింపని మనుష్యులకుఁ బూజనార్థంబుగాఁ ద్రేతాయుగంబునందు హరి ప్రతిమలు గల్పింపంబడియెఁ గొందఱు ప్రతిమార్చనంబు సేయుదురు పాత్ర పురుషద్వేషులైన వారలకు నట్టి ప్రతిమార్చనంబు ముఖ్యార్థప్రదంబు గాదు మందాధికారులకుఁ బ్రతిమార్చనంబు పురుషార్థప్రదం బగును. 453

ఆ. అఖిలలోకములకు హరి దైవతము సూడ
హరికి దైవతము ధరాధినాథ
పదపరాగలేశ పంక్తిచేఁ ద్రైలోక్య
పావనంబు సేయు బ్రాహ్మణుండు. 454

వ. అట్టి బ్రాహ్మణజనులందుఁ గర్మనిష్ఠులుఁ దపోనిష్ఠులు వేదశాస్త్రనిష్ఠులు జ్ఞానయోగనిష్ఠులునై కొందఱు వర్తింతు రందు జ్ఞాననిష్ఠునికి ననంతఫలకాముఁడైన గృహస్థుండు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును దేవతలనుద్దేశించి హవ్యంబులును బెట్టుట ముఖ్యంబు దైవకార్యంబులకు నిరువుర నైన నొకరి నైనఁ బితృకార్యంబునకు ముగ్గుర నైన నొకరి నైన భోజనంబు సేయింపవలయు ధనవంతునికైనను శ్రాద్ధవిస్తారంబు గర్తవ్యంబుగాదు దేశకాలప్రాప్త కందమూల ఫలాదికంబయిన హరినైవేద్యంబున విధిచోదిత ప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందుఁ బెట్టిన యన్నంబు గామదంబయి యక్షయఫలకారియగు ధర్మతత్త్వవేది యైనవాఁడు శ్రాద్ధంబులందు మాంసప్రదానంబు సేయక భక్షింపక చరియింపవలయు గందమూలాది దానంబున నయ్యెడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు ప్రాణిహింస సేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు యజ్ఞవిధులై నిష్కాములయిన ప్రోడలు బాహ్యకర్మంబులు విడిచి యాత్మజ్ఞాన దీపంబులందుఁ గర్మమయంబులయిన యజ్ఞంబుల నాచరింతురు. 455

క. పశువులఁ బొరిగొని మఖములు
విశదములుగఁ జేయు బుధుని వీక్షించి తముం
బిశసనము సేయునో యని
క్రశిమఁ బెగడొందు భూతగణము నరేంద్రా. 456

వ. అది గావున ధర్మవేది యయినవాఁడు దైవప్రాప్తంబులయిన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తిక క్రియలఁ జేయవలయు నిజ ధర్మబాధకంబయిన ధర్మంబును బరధర్మ ప్రేరితంబయిన ధర్మంబును నాభాస ధర్మంబును బాషండ ధర్మంబును గపట ధర్మంబును ధర్మజ్ఞుండయినవాఁడు మానవలయు నైసర్గిక ధర్మంబు దురితశాంతి సమర్థంబగు నిర్ధనుండు ధర్మార్థంబు యాత్ర సేయుచున్నైన ధనంబు గోరవలవదు జీవనోపాయమునకు నిట్టట్టు దిరుగక కార్పణ్యంబు లేక జీవించుచు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండై యెద్దియుం గోరిక బ్రదికెను సుగుణునికిం గల సుఖంబు గామలోభంబుల దశదిశలం బరిధావనంబు సేయువానికి సిద్ధింపదు పాదరక్షలు గలవానికి శర్కరా కంటకాదుల వలన భయంబు లేక మెలంగ నలవడుభంగిఁ గామంబువలన నివృత్తి గలవారికి నెల్లకాలంబును భద్రంబగు నుపస్థమునకును జిహ్వాదైన్యంబునకును బురుషుండు గృహపాలక శునకంబుకైవడి సంచరించుచు సంతుష్టి లేక చెడు సంతోషిగాని విప్రుని విద్యాతపోవిభవ యంశంబులు నిరర్థకంబులగు నింద్రియ లోలత్వంబున విజ్ఞానంబు నశించు సకల భూలోక భోగంబులు భోగించియు దిగ్విజయంబు సేసియు బుభుక్షా పిపాసల వలనఁ గామపారంబును హింస వలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు

సంకల్ప వర్జనంబున గామంబును గామవర్జనంబునఁ గ్రోధంబును నర్థానర్థ దర్శనంబున లోభంబును నద్వైతానుసంధానంబున భయంబును నాత్మానాత్మ వివేకంబున శోకమోహంబులును సాత్త్వికసేవనంబున దంభంబును మౌనంబున యోగాంతరాయంబును శరీర వాంఛ లేమిని హింసయు హితాచరణంబున భూతజంబయిన దుఃఖంబును సమాధిబలంబున దైవిక వ్యథయుఁ బ్రాణాయామాదికంబున మన్మథవ్యథయు సాత్త్వికాహారంబుల నిద్రయు సత్త్వగుణంబున రజస్తమంబులును నుపశమంబున సత్త్వంబును గురుభజన కుశలుఁడై శీలంబున జయింపవలయు.

క. హరిమహిమఁ దనకుఁ జెప్పిన
గురువుఁ నరుఁడనుచుఁ దలఁచి కుంఠితభక్తిం
దిరుగు పురుషు శ్రమమెల్లను
కరిశౌచము క్రియ నిరర్థకంబగు నధిపా. 458

ఉ. ఈవనజాతనేత్రు బరమేశుమహాత్ముఁ బ్రధానపూరుషుఁ
దేవవరేణ్యు సజ్జనవిధేయు ననంతుఁ బురాణయోగి సం
సేవితపాదపద్ముఁ దమ చిత్తములఁ నరుడంచు లోకు లి
చ్ఛావిధిఁజూచు చుండుదురు సన్మతి లేక నరేంద్రచంద్రమా.

వ. వినుము షడింద్రియంబులలోన నొకటియందు దత్పరులై యిచ్ఛాపూరణ విధానంబులఁ జరితార్థుల మ్రైతి మనువారలు ధారణాభ్యాస సమాధి యోగం

బుల సాధింపలేరు, కృషి ప్రముఖంబులు సంసార సాధనంబులు గాని మోక్ష సాధనంబులు గావు కుటుంబ సంగంబునఁ జిత్తవిక్షేపంబగుఁ జిత్తవిజయ ప్రయత్నంబున సన్యసించి సంగంబు వర్జించి మితంబయిన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధ వివిక్త సమ ప్రదేశంబున నొక్కరుండు నాసీనుండై సుస్థిరత్వమునఁ బ్రణవోచ్చారణంబు సేయుచు రేచక పూరక కుంభకంబుల బ్రాణాపానంబుల నిరోధించి కామహతంబయిన చిత్తంబునఁ బరిభ్రమణంబు మాని కామవిసర్జనంబుసేసి మరలునంతకునిజనాసాగ్ర నిరీక్షణంబు సేయుచు నివ్విధంబున యోగాభ్యాసంబు సేయువాని చిత్తంబు గాష్ఠ రహితంబయిన వహ్ని తెఱంగున శాంతిం జెందుఁ గామాదులచేత వేధింపంబడక ప్రశాంత సమస్తవృత్తంబయిన చిత్తంబు బ్రహ్మసుఖసమ్మర్శనంబున లీనంబై మఱియు నెగయ నేరదు. 460

మ. ధరణీదేవుఁడు సన్యసించి యతియై ధర్మార్థకామంబులం బరివర్జించి పునర్విలంబమునఁ దత్ప్రారంభి యైనేని లో భరతింగ్రిక్కనకూడుమంచిదనుచుఁ భక్షించి జీవించు దు । ర్నరుచందంబున హాస్యజీవనుఁడగుఁ నానాప్రకారంబులఁ. 461

క. మలమునఁ గ్రిమియును బడుక్రియ
నిలఁబడునోడ లాత్మగాదు హేయంబనుచుం

దలఁతురు తజ్ఞులు వొగడుదు
రలసత నొడ లాత్మ యనుచు నజ్ఞు లితేశా. 462

ఆ. వ్రతము మానఁ దగదు వడుగుఁగుఱ్ఱనికిని
గ్రియలుమానఁ దగదు గృహగతునికిఁ
దపసి కూర నుండఁ దగదు సన్యాసికి
దరుణితోడిపొత్తు తగదు తగదు. 463

సీ. రథము మేనెల్ల సారథిబుద్ధి యింద్రియ
గణము గుఱ్ఱములు పగ్గములు మనము
ప్రాణాదిదశవిధ పవనంబు లిరుసు ధ
ర్మాధర్మగతులు రథాంగకములు
బహుళతరంబైన బంధంబు చిత్తంబు
శబ్దాదికములు సంచారభూము
లభిమాన సంయుతుం డయిన జీవుఁడు రథి
ఘనతర ప్రణవంబు కార్ముకంబు

తే. శుద్ధజీవుండు బాణంబు శుభదమైన
బ్రహ్మమంచిత లక్ష్యంబు పరులు రాగ
భయ మద ద్వేష శోక లోభ ప్రమోహ
మానమత్సరముఖములు మానవేంద్ర. 464

వ. ఇట్లు మనుష్యశరీర రూపంబయిన రథంబు దనవశంబు
సేసికొని మహాభాగవతచరణ కమలసేవానిశితంబయిన
విజ్ఞానఖడ్గంబు ధరించి శ్రీమన్నారాయణ కరుణావలోకన
బలంబున రాగాదిశత్రు నిర్మూలనంబు గావించి ప్రణవ

బాణాసనంబున శుద్ధజీవశరంబును సంధించి బ్రహ్మమనియెడి గుఱియందుఁ బడనేసి యహంకారరథికుండు రథికత్వంబుమాని నిజానందంబున నుండ వలయు నట్టి విశేషంబు సంభవింపని సమయంబున బహిర్ముఖంబు లయిన యింద్రియ ఘోటకంబులు బుద్ధిసారథి సహితంబులై స్వాభిమానరథికుని ప్రమత్తత్వంబు దెలిసి ప్రవృత్తిమార్గంబు నొందించి విషయ శత్రుమధ్యంబునం గూల్చిన. 465

ఆ. విషయశత్రులెల్ల విక్రాంతితోడ సా
రథిసమేతుఁ డయిన రథికుఁ బట్టి
యుగ్రతిమిర మృత్యుయుతమగు సంసార
కూపమధ్యమందుఁ గూల్తు రధిప. 466

వ. వినుము వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబును నన రెండు దెఱంగులయ్యె నందుఁ బ్రవృత్తంబునఁ బున రావర్తనంబును నివృత్తంబున మోక్షంబును సిద్ధించు బ్రవృత్త కర్మంబులోన నిష్టాపూర్తంబులన రెండు మార్గంబులు గల వందు హింసా ద్రవ్యమయ కామ్యరూపంబులయిన దర్శపూర్ణ మాస పశుసోమయాగ వైశ్వ దేవ బలి హరణ ప్రముఖంబులైన యాగాదికంబు లిష్టంబులు దేవతాలయ వనకూప తటాక ప్రముఖంబులు పూర్తంబులు ప్రవృత్తకర్మంబున దేహంబువిడచి దే హాంతరారంభంబునొందు దేహిహృదయాగ్రంబు వెలుంగ

వానితోడ నింద్రియంబులగూడి భూతసూక్ష్మ యుక్తుండై ధూమదక్షిణాయన కృష్ణపక్ష రాత్రి దర్శంబుల వలన సోమలోకంబుఁ జేరి భోగావసానంబున విలీన దేహుండై వృష్టిద్వారంబునఁ గ్రమంబున నోషధిలతాన్న శుక్లరూపంబులం బ్రాపించి భూమి యందు జన్మించు నిది పునర్భవ రూపంబున పితృ మార్గంబు నివృత్తకర్మ నిష్ఠుండయినవాఁడు జ్ఞానదీప్తం బులయిన యింద్రియంబులందుఁ గ్రియా యజ్ఞంబుల యజించి యింద్రియంబుల దర్శనాదిసంకల్ప మూలం బయిన మనంబునందు వికారయుక్తంబయిన మనంబును వాక్కునందు విద్యావిలక్షణయయిన వాక్కును వర్ణ సముదాయంబునందు వర్ణసముదాయంబును నకారాది స్వర త్రయాత్మకంబయిన యోంకారంబునందు నోంకా రంబును బిందువందు బిందువునునాదంబునందునాదంబును బ్రాణంబునందుఁ బ్రాణంబును బ్రహ్మమందు నిలుప వలయును దేవమార్గంబయిన యుత్తరాయణ శుక్లపక్ష దివాప్రాహ్ణ పూర్ణిమారాకల వలన సూర్యద్వారంబున బ్రహ్మలోకంబునందుఁ జేరి భోగావసానంబున స్థూలో పాధియైన విశ్వుండై స్థూలంబును సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధియైన తైజసుండై సూక్ష్మంబును గారణంబులందులయించి కారణోపాధియైన ప్రాజ్ఞుండై కారణంబును సాక్షిస్వరూపంబునందు లయించి

తురీయుండై సూక్ష్మలయంబునందు శుద్ధాత్ముండై యివ్విధంబున ముక్తుండగును.

ఆ. అమరనిర్మితంబులై యొప్పు పితృదేవ
సరణు లెవ్వఁ డెఱుఁగు శాస్త్రదృష్టి
నట్టివాఁడు దేహియై మోహమున నొందఁ
డతిశయించుబుద్ధి నవనినాథ. 468

వినుము దేహాదులకుఁ గారణత్వంబున నాదియందును నవధిత్వంబున నంతమందును గలుగుచు బహిరంగంబున భోగ్యంబును నంతరంగంబున భోక్తయు బరంబున పరంబును జ్ఞానంబున జ్ఞేయంబును వచనంబున వాచ్యమును నప్రకాశమునఁ బ్రకాశంబును నైనవస్తువునకు వేఱొండు లేదు ప్రతిబింబాదికంబు వస్తుత్వంబునం జేసి వికల్పితంబై తలంపంబడుభంగి నైంద్రియాకంబైన సర్వంబును సత్త్వంబున వికల్పితంబయి తోఁచుంగాని పరమార్థంబుగాదు దేహాదికంబులు మిథ్యాత్మకంబులు వానికి హేతువులైన క్షితిప్రముఖంబులకు మిథ్యాత్వం బగుట సిద్ధంబు పరమాత్మకు నవిద్యచేత నెంతదడవు వికల్పంబు దోఁచు నంత దడవును భ్రమంబునుం దోఁచు నవిద్యానివృత్తియైన సర్వంబును మిథ్య యని శాస్త్రవిధినిషేధంబులు కల లోపల మేలుకన్న తెఱంగగు భావాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబులు మూఁడు గల వందుఁ బటతంతున్యాయంబునఁ గార్యకారణంబులందు వస్త్వైకత్వాలోచనంబు

సేసి వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు మనో వాకాయకృతంబులైన సర్వకర్మంబును ఫలభేదంబు సేయక పరబ్రహ్మార్పణంబు సేయుట క్రియాద్వైతంబు పుత్ర మిత్ర కళత్రాది సర్వప్రాణులకుం దనకును దేహంబునకుం బంచభూతాత్మకత్వంబున భోక్త యొక్కండను పరమార్థత్వంబున సర్వకామంబుల యెడ నైక్యదృష్టి జేయుట ద్రవ్యాద్వైతంబు నేర్పున నాత్మ తత్త్వానుభవంబున నద్వైత త్రయంబును విలోకించి వస్తుభేద బుద్ధియుఁ గర్మభేద బుద్ధియు స్వకీయ పరకీయ బుద్ధియు స్వప్నంబులుగాఁదలంచిమునియైనవాఁడుమానవలయు.

క. వాదములు వేయు నేటికి
వేదోక్తవిధిం జరించు విబుధుఁడు గృహమం
దాదరమున నారాయణ
పాదంబులు గొలిచి ముక్తిపదమున కేఁగున్. 470

శా. భూపాలోత్తమ మీరుభక్తిగరిమస్ఫూర్తిన్ సనోజేక్షణ। శ్రీపాదాంబుజ యుగ్మమున్ నియతులై సేవించి కాదే మహా। గ్రాపత్సంఘములోనఁ జిక్కక సమస్తాశాంతనిర్జేతలై। యేపారంగ మఖంబు సేసితిరి దేవేంద్ర ప్రభావంబునన్. 471

—* నారదుని పూర్వజన్మ వృత్తాంతము. *—

వ. వినుము పోయిన మహా కల్పంబునందు గంధర్వులలోన నుపబర్హణుం డను పేర గంధర్వుండనైన నేను సౌందర్య

మాధుర్య గాంభీర్యాది గుణంబుల సుందరులకు బ్రియుం డనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలైన బ్రహ్మలు దేవసత్త్రి మనియెడి యాగంబులోన నారాయణ కథలు గానంబు సేయు కొఱకు నప్సరోజనులను గంధర్వులనుం జీరిన, 472

ఆ. క్రతువులోని కేగు గంధర్వగణముతోఁ
గలసిపోయి విష్ణుగాథ లచటఁ
గొన్ని పాడి సతులఁగూడి మోహితుఁడనై
తలఁగి చనితి నంత ధరణినాథ! 473

క. వారిజగంధుల పొత్తున
వారింగ్గొనక తలఁగి వచ్చినబుద్ధిఁ
వా రెఱిఁగి శాప మిచ్చిరి
వారింపఁగరాని రోష వశమున నధిపా. 474

ఆ. పంకజాక్షు నిచటఁ బాడక కామినీ
గణముఁ గూడి చనిన కల్మషమున
దగ్ధకాంతి వగుచు ధరణీతలంబున
శూద్రజాతిసతికి సుతుఁడ వగుము. 475

వ. అని యిట్లు విశ్వస్రష్టలు శపించిన నొక్క బ్రాహ్మణ దాసికిఁ బుత్రుండనై జన్మించి యందు బ్రహ్మవాదు లయిన పెద్దలకు శుశ్రూష సేసిన భాగ్యంబున నిమ్మహా కల్పంబునందు బ్రహ్మపుత్రుండనై జన్మించితి. 476

ఆ. కౌశలమున మోక్షగతికి గృహస్థుఁ డే
ధర్మమాచరించి తగిలిపోవు
నట్టిధర్మమెల్ల నతివిశదంబుగాఁ
బలుకఁబడియె నీకు భవ్యచరిత. 477

మ. అఖిలాధారుఁ డజాదిదుర్లభుఁడు బ్రహ్మంబైన విష్ణుండు నీ । మఖమందర్చితుఁడై నివాసగతుఁడై మర్త్యాకృతిన్ సేవ్యుఁడై । సఖుఁడై చారకుడై మనోదయితుఁడై సంబంధియై మంత్రియై । సుఖదుండయ్యె భవన్మహామహిమ దాఁజోద్యంబు ధాత్రీశ్వరా!

వ. అనియిట్లు నారదుండు సెప్పిన వృత్తాంతంబయు విని ధర్మనందనుండు ప్రేమవిహ్వలుండై వాసుదేవునిం బూజించె నాసుదేవ ధర్మనందనులచేతఁ బూజితుండై నారదమునియు దేవమార్గంబునం జనియెనని శుక యోగీంద్రుండు పాండవ పౌత్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పిన, 479

క. రాజీవ సదృశలోచన
రాజీవభవాది దేవ రాజవినుత వి
భ్రాజితకీర్తిలతావృత
రాజీవభవాండభాండ రఘుకుల తిలకా. 480

మాలిని. ధరణి దుహితృరంతా ధర్మమార్గాను గంతా
నిరుపమనయవంతా నిర్జరారాతిహంతా
గురుబుధసుఖకర్తా కుంభినీచక్రభర్తా
సురభయపరిహర్తా సూరిచేతోవిహర్తా. 481

గద్యము. ఇది పరమేశ్వర కరుణాకలితకవితా విచిత్ర కేసన మంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన శ్రీమహాభాగవతంబను మహా పురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల పూర్వజన్మవృత్తాంతంబు సెప్పుటయు హిరణ్యకశిపు దితి సంవాదంబునుసుయజ్ఞోపాఖ్యానంబునుయమసల్లాపంబును బ్రహ్మ వరలాభ గర్వితుండైన హిరణ్యకశిపు చరిత్రం బును ప్రహ్లాద విద్యాభ్యాస కథయును ప్రహ్లాద హిరణ్య కశిపుల సంవాదంబును ప్రహ్లాదు వచనంబు ప్రతిష్ఠింప హరి నరసింహ రూపమున నావిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకు నభయంబిచ్చి నిఖిలదేవతా నివహ ప్రహ్లాదాది స్తూయమానుండై తిరోహితుం డగు టయుఁ త్రిపురాసుర వృత్తాంతంబును నీశ్వరుండు త్రిపురంబుల దహించుటయు వర్ణాశ్రమ ధర్మ వివరణం బును ప్రహ్లాదాజగరసంవాదంబును స్వధర్మ ప్రవర్తకుఁ డగు గృహస్థుండు ముక్తుండగు మార్గంబు నారదుండు ధర్మజునకుఁ దెలుపుటయు నారదు పూర్వజన్మ వృత్తాంతంబును ననుకథలంగల సప్తమస్కంధము సర్వము సమాప్తము.

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.



# ప్రహ్లాదచరిత్రము



## కఠినపదములకు అర్థములు.

### అ

అనర్గళము=అడ్డులేనిది

అనీకము=సమూహము

అవారితులు=అడ్డపడనివారు

అదభ్రము=అధికము

అశ్రాంతము=ఎల్లప్పుడు

అస్రము=కన్నీరు

అంతకభూతుఁడు=మృత్యువువంటి వాఁడు

అజరామరభావము=ముసలితనము, చావు లేకుండుట

అమోఘము=వ్యర్థము కానిది, అధికము

అరాతి=శత్రువు

అట్టళ్ళు=కోట బురుజులు

అనన్య శరణ్యులు=వేఱు గతులు లేనివారు

అఖర్వము=తఱుఁగు లేనిది

అప్రమత్తుఁడు=ఏమఱకుండువాఁడు

అనుకంప=దయ

అసద్గ్రాహ్యము=చెడ్డదిగాఁ దెలియఁదగినది

అయస్కాంతము=సూదంటురాయి

అంధేందూదయములు=గ్రుడ్డివానికి చంద్రోదయములవంటివి

అకించన=ఉపాయము ఏదియు లేని

అర్భకుని=బాలుని

అఘనిచయము=చెడ్డవిషయముల గుంపు

అవసానము=ముగింపు

అతీతము=అతిక్రమించినది

అవికల్పితుఁడు=మారుపల లేనివాఁడు

అనిర్దేశ్యుఁడు=నిర్ణయింప వీలు లేనివాఁడు

అవనము=కాపాడుట

అపక్షీణత్వము=క్షీణతనొందని యున్కి

అపవర్గము=ముక్తి

అశని సంకాశము=పిడుగుతో సమానము

అస్మదీయంబయిన=నాదయిన

అభ్రంకషము=ఆకసము నొరయుచున్నది

అంహుఁడు=పాపముకలవాఁడు

అనసూయ=కోపము లేని

అనురూపంబుగన్=తగినటు

అపగత=నశించినది

### ఆ

ఆక్రామిత = వ్యాపింపఁబడిన
ఆఖ్యానములు = కథలు
ఆలవాలము = పాదు
ఆభీలము = భయంకరము
ఆఖండలుఁడు = ఇంద్రుఁడు
ఆపన్నతను = బాధను
ఆహూయమానుఁడు = పిలువఁబడినవాఁడు
ఆటోపము = విజృంభణము
ఆతురన్ = బాధపడుదానిని
ఆభీరులు = గొల్లలు
ఆవర్తము = సుడి
ఆంత్రమాలిక = ప్రేవుల మాలిక
ఆమములు = అపక్వములు

### ఇ

ఇంధనము = కట్టె
ఇభ్యుఁడు = శ్రేష్ఠుఁడు
ఇంద్రియానీకమున్ = ఇంద్రియముల సముదాయమును
ఇద్ధ = శ్రేష్ఠమైన

### ఈ

ఈశానుఁడు = భగవంతుఁడు
ఈషత్ = కొంచెము

### ఉ

ఉత్పాదించి = పుట్టించి
ఉత్కంఠత = వేగిరపాటు
ఉద్దామ = ఎక్కువయిన
ఉర్వీరుహము = చెట్టు
ఉద్ధతి = గర్వము
ఉజ్జాతమయ్యెన్ = పుట్టెను
ఉపరంతవ్యుండు = నిలిపివేయదగినవాఁడు
ఉన్ముఖుగావించును = ఎదురుగా నిలుపును
ఉపక్రాంతిన్ = కూడికతో
ఉద్యుక్తులు = ప్రయత్నించినవారు
ఉల్లంఘించి = తిరస్కరించి
ఉన్మూలింపుము = త్రెంపివేయుము
ఉత్కరము = సమూహము
ఉదగ్రము = అధికము
ఉద్దీపించునే = ప్రకాశించునే
ఉరగము = పాము
ఉపాదాన కారణము = హేతుభూతము

### ఎ

ఎడరుచోట = ఆపత్కాలమున
ఏకాంతులు = అంతరంగభక్తులు
ఏక్రియన్ = ఎట్లు
ఏతద్విశ్వము = ఈ ప్రపంచము
ఏచక్కటిన్ = ఏస్థలమునందును

### ఔ

ఔదల = శిరస్సు

### క

కంటకము = ముల్లు
కండూతి = దురద
కంపమాన = వణకుచున్న
కకుప్పులు = దిక్కులు
కరాళము = భయంకరము
కటములు = చెక్కిళ్ళు

కటాహము=కడవ
కర్కశము=కఠినము
కుఠోరకరుడు=బలముగలవాఁడు
కరిశౌచము=ఏనుఁగు నీరుచల్లుకొనుట
కల్పాంతము=ప్రళయకాలము
కరాళించి=బొబ్బరించి
కళలన్=కోరడాలచే
కామదుండు=కోర్కులిచ్చువాఁడు
కారుణ్యము=దయ
కాలచోదితము=కాలముచే ప్రేరేపింపఁబడినది
కాహళము=బాకా
కీలు=ఉపాయము
కీచకము=వెదురు
కుంభిని=భూమి
కుంభీనస=ఆదిశేషుని
కుంఠితము=అణఁగిపోయినది
కుంఠీకృతులు=వ్యర్థులుగాఁ జేయఁ బడినవారు
కుతలము=భూమి
కుటజము=కొడిసెచెట్టు
కుఠారము=గొడ్డలి
కులదీపకుఁడు=కులమును ప్రకాశింపఁ జేయువాఁడు
కుడ్యము=గోడ
కురరి=లకుముకి పక్షి
కుహనాన్వితుఁడు = కపటము గలవాఁడు
కేసరి=సింహము
కైవర్తకులు=చెంబడివాండ్రు
క్రోడసద్గంధంబుల్=పందికి మంచి గంధములవంటిది
క్రతువు=యజ్ఞము
క్రందుకొను=కలఁత జెందు
కృతఘ్నావలి=మేలు చేసినవారిని మఱచునట్టివారు
కృశలు=ప్రకాశింపనివి
కృపాళుఁడు=అంతరియందు దయ గలవాఁడు
కృశానుఁడు=అగ్నిహోత్రుఁడు

ఖ

ఖడ్గము=కత్తి
ఖలజన్మము=దుష్టజన్మము
ఖర్వటము=పాలెము
ఖద్యోతుఁడు=సూర్యుఁడు
ఖండించి=నశింపఁజేసి
ఖేటము=వేట

గ

గజరిపు=సింహము
గతాసులు=మరణించినవారు
గాఢము=దృఢము
గండశిలలు=పెద్దరాళ్ళు
గంతవ్యుఁడు=పోఁదగినవాఁడు
గుణవ్యతికరము=గుణములు హెచ్చుతగ్గు గలది
గుంపించెదు=అతిక్రమించెదవు
గ్రంథాఖ్యాపనముల్=గ్రంథములను జెప్పుటవంటివి
గ్రాహ్యములు=తెలియఁదగినవి
గోపధ్వజుఁడు=వృషభధ్వజము గలవాఁడు

ఘ

ఘటపటాదులు=కుండలు, గుడ్డలు మున్నగునవి
ఘస్రములు=పగళ్ళు
ఘ్రాణము=ముక్కు
ఘుష్యమాణ=ఘోషించుచున్న
ఘోషము=గొల్లపల్లె, ధ్వని
ఘోరాహవక్షోణి=క్రూరమైన యుద్ధభూమి
ఘోటకము=గుఱ్ఱము

చ

చక్కడఁతున్=సంహరింతును
చక్రి=చక్రము గల విష్ణువు
చక్కడిచె=చంపె
చర్వితచర్వణులయినవారికి=అనుభవించిన విషయములనే మరల ననుభవించువారికి
చతుర్వింశతి=ఇరువదినాలుగు
చాగింపఁడు=పంపఁడు
చంక్రమ్యమాణ=దాటులు పెట్టుచున్న
చంక్రమణము=దాటుట
చాంచల్యమాన=చలించుచున్న
చిరతరము=బహుకాలము
చిబుకంబు=గడ్డము
చీమగమి=చీమలగుంపు
చుంచు=జుట్టు

జ

జఠరము=కడుపు
జంగమస్థావరములు=చరాచరములు
జంజన్యమానంబులు=ఊరక పుట్టుచున్నవి
జంఘన్యమానము=పోఁగొట్టబడినది
జాలము=సముదాయము
జాడ్యము=అజ్ఞానము
జాగరణము=జాగ్రత్త
జాజ్వల్యమానము=మండుచున్నది
జ్వాలాయమాన=సెగలను బోలుచున్నవియు
జిహ్వ=నాలుక
జీమూతము=మేఘము
జేగీయమానుఁడు=ప్రకాశించుచున్నవాఁడు

డ

డగ్గఱెదవు=సమీపించెదవు
డింభకులు=పిల్లలు

త

తంతన్యమాన=సూత్రములగుచున్న
తంతువర్గము=దారములగుంపు
తటిల్లత=మెఱపుతీగ
తత్త్వము=జ్ఞానము
తత్పరత్వము=ఆసక్తి
తన్మయుఁడై=భగవత్స్వరూపము నినయించువాఁడై
తనుతర=మిక్కిలితక్కువయగు
తమస్వినీచరుఁడు=రాక్షసుఁడు
తరంగిణులు=సాధారణపుటేళ్ళు
తరణి=ఓడ
తరలతరాయమాణ=చలించుచున్నదియగు

తర్జింపంగా = బెదరింపఁగా
తర్షము = ఇచ్ఛ
తారుణ్యము = యౌవనము
తిక్తము = చేదు
తెరలగా = బెదరిపరుగెత్తునట్లు
త్రిసప్త = ఇరువదియొకటి
తృష్ణ = ఆశ

ద

దనుజకుంజర = రాక్షసశ్రేష్ఠుడా
దశనచ్ఛదము = పెదవి
దర్వి = తెడ్డు
దర్శ = అమావాస్య
దంభోక్తులు = స్వల్పపు పలుకులు
దక్షులు = నేర్పుగలవారు
దళితము = పగులగొట్టఁబడినది
దంభకులు = దోషముగలవారు
దందహ్యమానము = మిక్కిలి కాల్చఁబడినది
దంశవ్రాతము = దోమలగుంపు
దండతాడితము = కొయ్యతోఁ గొట్టఁబడిన
దంభోళి = వజ్రాయుధము
దంష్ట్రి = వరాహము
దావదహనము = కార్చిచ్చు
దారువు = కట్టె
దిగీశవ్రాతము = దిక్పాలురసమూహము
దిగిభములు = దిగ్గజములు
దుడుకని = దుష్టుని
దురవగాహంబు = తెలిసికొనశక్యముకానిది
దురవలోకనీయము = చూచుటకు శక్యముకానిది
దురాత్మదరతుఁడు = చెడ్డపనియందిచ్ఛగలవాఁడు
దురితి-|-ఉన్మేషము = చెడునడత
దుర్మేధగా = దుష్టబుద్ధిచేత
దుష్టమగు = దోషసహితమగు
ద్రుమము = చెట్టు
దైవికార్థచయము = దైవప్రయోజనసమూహము
దైత్యాగ్రభవులు = రాక్షసబాలురు
ద్రోణి = మధ్యప్రదేశము
దోషాకులేంద్రుండు = నిశాచరపతి
దోషాచరుఁడు = రాక్షసుఁడు
దోర్బలినులు = భుజబలమున నడఁగినవారు

ధ

ధన్యతముఁడు = కృతార్థుఁడు
ధమనీవితానంబు = నరముల సముదాయము
ధార = అంచు
ధిక్కరించి = తిరస్కరించి
ధారేయ = వహించిన
ధ్యేయము = ధ్యానముచేయఁదగినది

న

నక్తంచరులు = రాక్షసులు
నాళము = నాడి
నిశిత = మిక్కిలి వాడియగు
నిబిడము = దట్టము
నిర్మథనము = హరించునది

నివిష్టులు = చేరినవారు
నిహతుఁడు = చంపఁబడినవాఁడు
నిమిషము = రెప్పపాటు
నిర్జరులు = దేవతలు
నిలింపులు = దేవతలు
నిశలు = రాత్రులు
నిమీలిత = మూయఁబడిన
నిపుణత = నేర్పు
నిజేచ్ఛ = స్వబుద్ధి
నిర్ణయింపరాని = నిశ్చయింపజాలని
నిశాటసుతులు = రాక్షస బాలురు
నిర్గమద్వారము = వెలుపలికిఁబోవు గుమ్మము
నిస్త్రైగుణ్య లక్షణంబు = సత్త్వరజస్తమోగుణములు లేని లక్షణములు
నిష్కంటకవృత్తి = భీతిలేనిరీతి
నిర్భీకుఁడు = భయములేనివాఁడు
నిర్ఘాతసంఘము = పిడుగుల గుంపు
నిర్ఘోషము = ధ్వని
నికాశము = సమానము
నిరవకాశము = ఎడము లేనిది
నిమ్నగ = నది
నిర్గళిత = జారిన
నిస్త్రింశము = దయ
నిరుద్ధములు = క్రమ్మఁబడినవి
నీరంధ్రము = సందులేనిది
నీరదము = మేఘము
నీహారము = మంచు
నీతిపారగుఁడు = తుదముట్ట నీతి తెలిసినవాఁడు
నెగులు = బాధ
నైజమనీష = స్వభావముచేత నేర్పడిన బుద్ది

ప

పంచాననము = సింహము
పదవి = మార్గము
పటలము = సముదాయము
పవనకుంభితచర్మభస్త్రి = గాలిచేత నిండినతోలుతిత్తి
పరివేధించుట = బాధపెట్టుట
పరిచ్ఛదములు = పైకప్పులు
పరిగృహ్యమాణము = అంగీకరింపబడినది
పరిస్ఫోటితము = చీలినది
పానీయము = నీరు
పాకారి = ఇంద్రుఁడు
పాటిల్లుట = కలుగుట
పాదము = ఒడ్డు
పాంథులు = బాటసారులు
పిపీలికలు = చీమలు
పుంభావమైన వానిక్ = పురుషస్వరూపముగా నున్నదో యనునట్లున్నవాఁడు
పుంజము = సమూహము
పులకలు = గగుర్పాటులు
పుల్కసులు = బోయలు
ప్రకృతి = దేహము
ప్రప = చలివెందర
ప్రణయము = భక్తి, ప్రేమ
ప్రతిపక్షులు = విరోధులు
ప్రతివీరుడు = విరోధి
ప్రభంజనము = వాయువు

ప్రయాసగమ్యము = కష్టముచేత దొర
కునది
ప్రస్థానము = ప్రయాణము, ఉనికిపట్టు
ప్రసూతి = కాన్పు
ప్రువ్వాదు = పుచ్చిపోదు

## ఫ

ఫణులు = పడగలు
ఫాలము = నొసలు

## బ

బంభజ్యమానమగు = భాగింపఁబడిన
దగు
బంధురాజి = బంధుసముదాయము
బహుమాయుఁడు = అధికమాయలు
గలవాఁడు
బాణాసనము = విల్లు
బుద్ధివికల్పము = భేదబుద్ధి
బుభుక్షాపిపాసలు = ఆకలినీరువట్టులు
బురుడ = బుడుబుడక్కలు
బృందారకులు = దేవతలు

## భ

భవశతములు = నూరుజన్మములు
భగ్నుఁడు = ఆపదనుబొందినవాఁడు
భద్రమంచు = మంచిదని
భస్మహవ్యములు = బూడిదలో వేల్పఁ
బడిన హవ్యములు
భల్లము = ఈటె
భంగురము = నాశనము
భాగధేయుఁడు = పుణ్యముగల
వాఁడు
భాగవతులు = భగవద్భక్తులు
భిన్నులు = వైషమ్యమును బొందిన
వారు
భిల్లులు = [redacted]
భూయిష్ఠము = అధికము
భ్రంశము = చలనము
భ్రుకుటి = కనుబొమ
భృత్యులు = సేవకులు
భ్రాంతుఁడు = తెలివిలేనివాఁడు

## మ

మఖము = యజ్ఞము
మదనము = మంగచెట్టు
మదలి = గర్వముచే నిండినవాఁడు
మనస్కుఁడు = మనస్సు గలవాఁడు
మధురాయమాణము = ప్రీతినిగలి
గించునది
మహిళ = స్త్రీ
మస్తకము = తల
మయూఖజాలము = కిరణ సము
దాయము
మంతవ్యుఁడుగాడు = ఇష్టుఁడుగాడు
మంతనంబునన్ = రహస్యముగా
మంజీరము = కాలియందె
మాతంగజాతులు = మాదిగజాతి
వాండ్రు
మాతంగము = ఏనుఁగు
మిథ్య = అసత్యము
ముక్త = విడువఁబడిన
ముక్తాఫలము = ముత్యము
ముఖర = మొదలుగాఁగల

ముఖరిత = మ్రోగుచున్న
ముముక్షువు = మోక్షమును గోరినవాఁడు
ములుకులు = బాణములు
మురజము = మద్దెల
ముష్టిపరిమేయము = పిడికిలిలో నడఁగునది
మేధ = తెలివి
మేఖల = మొలనూలు
మైరేయము = మద్యము

య

యత్కించిద్భీతి = కొంచెమైనను భయము
యథార్థము = తథ్యము
యాగము = యజ్ఞము
యాతుధాననికురుంబము = రాక్షసులగుంపు
యూథము = గుంపు
యోధ = యుద్ధవీరుఁడు
యోషా = స్త్రీ

ర

రజక = చాకలి
రక్షోబాలురకై = రాక్షసుల పిల్లలను
రంహునకై = వేగముగలవానికి
రిత్తజాలి = వృథాభిమానము
రోచులు = కాంతులు
రోరుధ్యమాన = నిరోధింపఁబడిన
రోమాంచులు = గగుర్పాటుగలవారు
రోదోంతరాళము = భూమ్యంతరిక్ష మధ్యప్రదేశము

ల

లంఘనము = దాటుట
లవిత్రము = కొడవలి
లవిత్రాయమాణము = కొడవలి యగుచున్నది
లక్షించుట = చూచుట
లక్షింపరాని = గుర్తింపరాని
లాంగలాయమాన = నాగలి యగుచున్నదియు
లాఘవము = లఘుభావము
లుబ్ధకుఁడు = కిరాతుఁడు
లేలిహానము = పాము
లోభవంతులు = ఆసయందాసక్తులు

వ

వంశము = వెదురుకులము
వన్యసత్త్వము = అడవిజంతువు
వపుః = శరీరము
వలను = నేర్పు
వలగొను = ప్రదక్షిణముచేయు
వయఃపాకంబులతోడ = వయస్సు ముదురఁగనే
వత్సలత = ఆసక్తి
వర్గత్రితయము = ధర్మార్థకామములు
వర్మము = కవచము
వళి = ముడుత
వక్త్రము = నోరు
వ్యథనము = నొగొట్టునది
వ్యతీపాతము = గృహము
వ్రశ్చనము = వ్రచ్చివేయునము
వృకము = క్రూరమృగము

వాక్పారుష్యము=తిట్టు
వామలూరువు=పుట్ట, వల్మీకము
వాంఛితములు=కోరఁబడినవి
వ్యావృత్తి=చేయుట
విదళించుట=త్రుంచుట
విటపము=కొమ్మ
విటంకము=చూరుకొణిగె
వితానము=మేలుకట్టు
వికటీకృతదక్షిణము=వికటముగా చేయుటయందు నేర్పుగల
విద్రుమము=పగడము
విశ్వంభర=భూమి
విగ్రహము=విరోధము, శరీరము
విషణ్ణుఁడై=దిగులుపడినవాఁడై
విశంకుఁడు=జంకు లేనివాఁడు
విలేఖనచుంచు=దున్నుటయందు సమర్థమైన
విస్రంభములు=భక్తులు
విస్రంభము=వధోద్యోగము
వెక్కురు=దుష్టుఁడు
వేల్లాయమాన=చుట్టివచ్చుచున్న

శ

శకుంతములు=పక్షులు
శక్రచాపము=ఇంద్రధనుస్సు
శబరుఁడు=ఎఱుకువాఁడు
శమనుఁడు=యముఁడు
శర్మ్యులు=క్షేమము గలవారు
శాపావధి=శాపాంతము
శాబకుని=చిన్నవానిని
శిఖి=అగ్ని
శిలవృత్తి=ఉంఛవృత్తి (వెన్ను లేరు కొనుట)
శుద్ధక్షాంతి=నిర్మలమైన ఓర్పు
శేముషీ=బుద్ధి
శైవాలము=నాచు
శైశవము=బాల్యము
శోధించి=ఏర్పఱచి
శోషణములు=ఎండించునవి
శోషింపఁగ=ఆరునట్లు
శ్వపచుఁడు=చండాలుఁడు
శృంఖలానిచయము=సంకెలల సముదాయము

ష

షోడశ=పదునాఱు

స

సదృక్షము=సమానము
సరఘలు=తేనెటీఁగలు
సర్వగతుఁడు=అన్నిటియందుండు వాఁడు
సర్వదర్శనుఁడు=అన్నింటిని గను వాఁడు
సర్వంకషము=సమగ్రము
సటలు=జడలు
సమహితత్వము=భేదము లేని నడవడిక
స్వసేనల=తమబలములు
సమ్మర్గనము=కలిమి
సముత్పద్యమాన=సంభవించుచున్న
సముత్కీర్యమాణము=మిక్కిలికప్పు చున్నది

సటాజాలము=జూలు వెండ్రుకల గుంపు
సహాధ్యాయులు=కూడఁ జదువువారు
సార్థము=అర్థముతోఁగూడిన
సానువు=చరియ
సాంపరాయికము=పరలోక సంబంధము
స్రస్తము=జారినది
సంసృతి=సంసారము
సంహృతికర్ములు=కర్మములు జంపినవారు
సంసరణ=పుట్టుక
సంవేద్యాంశంబులు=తెలిసికొనఁదగినవిషయములు
సంస్కారము=పని
సంశీర్ణంబులు=వదలిపోవునవి
సంధానములు=కలుగఁజేయునవి
సంఘాతము=సమూహము
సందష్టము=కరవబడినది
సంసిక్తము=తడుపఁబడినది
స్నిగ్ధము=నునుపు
సుపర్వులు=దేవతలు
సోత్కంఠుఁడు=మిక్కిలి కోరికగలవాఁడు
హాల=మద్యము
హుతాశనుఁడు=అగ్నిహోత్రుఁడు
హేతి=కత్తి, అగ్నిజ్వాల
హేలాకృష్టము=విలాసముచే లాగఁబడినది
హృదయగతుఁడు=మనస్సును పొందినవాఁడు

క్ష

క్షాంతి=ఓర్పు
క్షితిజాతము=చెట్టు
క్షేత్రజ్ఞుఁడు=జీవుఁడు

శ్రీ సుదర్శన ప్రింటింగ్ ప్రెస్, 7122-జనరల్ బజార్, సికింద్రాబాదు.